

శ్రీ పార్వతీపతయే నమః

# శ్రీశివశంకరశతకము.

సాంఖ్యతారక అమనస్కయోగపరిపూర్ణమగు

పారాయణగ్రంథము.

బ్రహ్మశ్రీ సువర్ణస బ్రహ్మగోత్రోద్భవప్రణవశాఖాధ్యాయనులగు

శ్రీ గోరస అప్పలాచార్యునిచే విరచితము.

( కస్తూరి రంగరంగ యను కీర్తన వరసపద్ధతి. )

1 శ్రీ పార్వతీ విలాసా యోగిజన । చిత్తజలరుహా నివాసా
పాపహార చంద్రభూషా । సేవింతు పాహిమాం శివశంకరా.

2 గజముఖుని పూజ జేసీ । భారతిని కమలాసనాది సురల
భజియింతు బ్రహ్మజ్ఞులా । కవివరుల ప్రార్థింతు
శివశంకర॥

3 అలరు తలిదండ్రులైనా । నరశింహా మాచార్యునీశ్వరాంబన్
దలతు యొనమండ్రి సీతా । రామార్యగత్వగురు శివ॥

4 శంక మది నింతలేకా । నే నొక్క శతకంబు రచియించెదా
పంకజాక్షనుత నీకూ । అర్పింతు భక్తితో శివ॥

5 ఆద్యంతములు లేకనూ అంతటను చోద్యముగ నిండియుండీ
సాధ్యపడ వది యేమిటో । చిత్ర మగు సర్వేశ శివ॥

6 త్రిపురసంహారనీదు । నామమును । జపము జేయుచుసతతమూ
।అపరిమితయానందుడై యుండుటే తపమెన్న శివ॥

7 ఆనందమే బ్రహ్మమూ । చూడ నిత్యానందమే స్వర్గమూ
ఆనందమును మించినా । పదవి లే దరయగా శివ॥

8 గురుని యెప్పుడు మరువకా।తనలోనె। వరదీక్షతో జూచుచూ
[illegible]వవలె నిహసుఖములా అది సౌఖ్యకరమౌను శివ॥

9 తాతనే వాడెవ్వడో । తానెవరో । తత్వజ్ఞులకు తెలియునూ
తానసే వాడు బ్రహ్మ । తామాయ తర్కించ శివ॥

10 జీవభావన తెలియకా జగమంత । చిద్రూపు డనుచుందురూ
జీవుడే దేవుడనుచూ । తెలియవలె స్థిరముగా శివ॥

11 కావవే కరుణాకరా । నను వేగ బ్రోవవే సుగుణాకరా
పావనము నీ మహిమలూ । యెన్నుటకు నా వశమ శివ॥

12 రక్షకుడ వీవె కదా । దుష్టజన శిక్షకుడ వీవె కదా
పక్షివాహన సన్నుతా । మదిలోన బ్రార్థింతు శివ॥

13 అరయ నిర్మలభక్తితో నిరతంబు మరువకను ధ్యానించినన్
ధర జన్మరహితు డగుచూ , తుద ముక్తిపరుడౌను శివ॥

14 శివశివా యనునామమూ భక్తితో । చవిజూచు మనుజులెల్లా
పరివిమలంబగు మోక్షమూ । బడయుదురు పరమేశ శివ॥

15 నీలతోయద మధ్యనూ । విద్యుల్లతాలీల భాసమగుచూ
చాలగా వెలుగుచున్నా । నిను జూడ సాధ్యమా శివ॥

16 సగుణు డందురు కొందరూ । నిర్గుణస్వామివందురు కొందరూ
సగుణనిర్గుణసాక్షివై వెలయుదువు సర్వేశ శివశంకరా॥

17 పంచాక్షరుడవు నీవే । పరికింప పంచాననుడవు నీవే
అంచితము నీ స్మరణ చే । నిహపరము లందెదరు ॥శి॥

18 సృష్టికిని పూర్వుడనుచూ శృతులెల్ల స్పష్టముగ దెల్పుచుండే
దుష్టులకు నీ మర్మమూ తెలియ బహు కష్ట మగు ॥శి॥

19 భక్తిచే లోకసుఖమూ సాధింప శక్తిగల్గును చూడగా
భక్తిచేతను మోక్షమూ సాధింపశక్తుడగు ॥శి॥

20 భక్తిచే నంబరీషా మార్కండ । ప్రహ్లాదరుక్మాంగదుల్
ముక్తి గాంచిరి చూడగా । ఘనతపశ్శక్తిచే ॥శి॥

21 సత్యమును వచియింపుడీ । ధర్మమును సంతోషమున జేయుడీ
నిత్యమును దర్శింపుడీ । పరశివుని నిక్కముగ ॥శి॥

22 నిత్యమే పరమాత్ముడూ యెప్పటిక।నిత్యమీ మాయ జగమూ
సత్యమే తోడునీడా । యోచింప । సర్వేశయ ॥శి॥

23 క్షణభంగురము దేహమూ గాన నిక।పరగ ధర్మమునే యుడీ
తన వెంట జను మృత్యువున్ । దప్పింప తరమౌనె ॥శి॥

24 సకల వాంఛల నంటకా। కష్టసుఖసరణి సమముగజూచుచూ
అకళంకమగు మనసుచే। నానంద మంద వలె ॥శి॥
25 ఖేదమోదములు విడచీ। యీ మాయవాదభేదముల నడచీ
నాదబ్రహ్మమును గాంచా అమనస్కసాధనము ॥శి॥
26 సాధులకు యిది ధర్మమూపరతత్వవాదులకు ఇదిన్యాయమూ
కా దనిన మరి శూన్యమూ మోక్షంబు గాన రిక ॥శి॥
27 కరుకైన రాళ్లయిననూ బహుమంచి।మెరుపైన పరుపులైనా
తరుశాఖ నీడైననూ సమముగా। పరుడెంచు ॥శి
28 ఇమ్మనుచు కోరడెవనీ। యెవ్వరే మిచ్చినను కూడ దనడూ
ఇమ్మహిని విజితేంద్రియుం।డలరారు నీ రీతి ॥శి॥
29 విద్యలెన్నియు నేర్చినా ధర నాత్మవిద్యతో సరితూగవూ
వేద్యులకు యిది నావయై దరి జేర్చు। వేడ్కతో ॥శి
0 కోటి జన్మము లెత్తియూ మూఢుడై। కాటిపాలై పోవునూ
సూటిగా నీ మంత్రమూ హృదయమున నాట నలె ॥శి
1 భోగములు గలిగినపుడే। ధర్మంబు పూని గావింపవలయూ
త్యాగశూన్యులకు లేదూ। పుణ్యంబు తథ్యముగ ॥శి
2 పాత్రమెరుగని దానము। నిర్మలక్షేత్ర మెరుగని విత్తనం
సూత్ర మెరుగనియోగతమువ్యర్థంబు। ధాత్రిలో ॥శి
3 జడరూపమగు జలముచేమోక్షంబు।బడయునందురుకొందరూ
యొడలు శుభ్రము గాకనూ తరియింపబడు టెట్లు ॥శి

34 ఇల్లు వాకిలి సంపదా । సతిసుతులు యెల్లబంధువు లెన్నగా
కల్ల యిక నిజవస్తువుల్ । తెలియవలె యుల్లమున ॥శి

35 అంటియుండక తిరుగుచూ ।సంసారబంటునలెనటియింపుచూ
పంటసమయము వచ్చినా । తొడుమూడి పడురీతి ॥శి

36 అరయ లోకసృష్టినీ । వేదవిధి పఠించు డార్యులారా
ధరను సత్య మసత్యమూ । దెలియుడీ ధర్మంబు ॥శి

37 ఓంకారరూపుడై నా పంచముఖు । డానరు శ్రీవిశ్వకర్మ
శంకర బ్రహ్మవిష్ణు । ఇంద్రాది సామ్రాట్టు ॥శి

38 పంచముఖులరయందునా । ముఖ్యన్ని ప్రపంచ నిర్మాణులై నా
పంచబ్రహ్మలు జనించీ । రా శ్రుతులు పఠింప ॥శి

39 సానగ బ్రహ్మ సద్యోజాతముఖు । జనితుండు గౌరీపతీ
తానే మనుబ్రహ్మయూ ఋగ్వేదదైవంబు ॥శి

40 వామదేవముఖంమునాజనియించె । వరమయబ్రహ్మవిష్ణూ
ప్రాముఖ్య మునసనాతనా । బ్రహ్మ మాసామ్రాట్టు ॥శి॥

41 ప్రకటితంబగు సఘోర । ముఖజుడా । భౌనస్బ్రహ్మత్వష్ట
సకల నిర్మాణకర్తా । వేదమా నామంబు ॥శి॥

42 పరగ తత్పురుషముఖము । నాగ్నై । ప్రత్న సబ్రహ్మసిల్పి
అరయ నిందుప్రడథర్వణా । వేదాధి కరుడౌను ॥శి॥

43 ప్రణవ వేదాధిపుండూ । యీశాన । జనితుండువిశ్వజ్ఞుడూ
గనసు సుపర్ణబ్రహ్మ యే సూర్యుండు । వినుతింప ॥శి॥

44 అరయపంచబ్రహ్మలూ యీజగత్కారులు।వేదాధిపతులు
ధారణీసర్వలోకా । నిర్మాణ ధాతలో శి॥

45 పంచవేదాధిపతులూ భావింప । పంచవిధ సృష్టికర్తల్
పంచమూర్తులుచూడగా । యీపంచ బ్రహ్మలో ॥శి॥

46 బ్రహ్మాండనిర్మాణులూ।యీలోకబ్రహ్మత్వమునకధిపతుల్
బ్రహ్మకర్మోద్ధారులూ ధరజన్మబ్రాహ్మణులు శి॥

47 పంచాంగమునుశృజించి । రీబ్రహ్మ పంచకములధిపతులుగా
మెంచి సర్వప్రపంచా । సుకర్మలకు యేర్పరచె ॥శి॥

48 మనువుచే తిథియుబుట్టె । వాసరముమయునిచాతనుజనించే
నక్షత్రములు త్వష్టచే శృష్టాయె స్పష్టముగ ॥శి॥

49 శిల్పి యోగాధిపుండూ । యోచింప విశ్వజ్ఞుడనుకరణముల్
యీపంచ అంగములకూ । దేవతులు విశ్వగురు ॥శి॥

50 పంచ భూతములచేత భావింప । పంచకోశములచేతా
పంచేద్రియములచేత । దేహమేర్పడియెనో ॥శి॥

51 పంచగుణములచేతనూ । చిత్ర ప్రపంచమయ్యెనుచూడగా
పంచలోకములు సర్వ । సృష్టిమును । భాసిల్లె ॥శి॥

52 ప్రత్యక్ష మాసూర్యుడూ । చంద్రుపంచభూతంబులెన్న
ప్రత్యక్షమెన్న విశ్వకర్మయిది । సత్యమగు ॥శి॥

53 పంచబ్రహ్మలకువిష్ణునూరుద్రుండూ।ఇంద్రుండుసూర్యుడునూ
పంచమూర్తులు జగములన్ । పంచగుణ పాలకులు ॥శి॥

54 పిండాండసృష్టివినుడూ।బ్రహ్మాండ । భాండమూ ధారమెన్న
దండి వేదాంతమునకూ । యీరెండు తత్వములు ॥శి॥

55 పంచ భూతములచేత చర్మాస్థి । పంచకోశములచేతా ।
గాంచ దేహంబేర్పడె । జన్మయన సంచితము ॥శి॥

56 స్త్రీయనుచుపురుషుడనుచు । లోకమునసృష్టిగ నుజీవకోటి
మాయయెనుబది నాలుగూ । లక్షలై । మగవెలయు ॥శి॥

57 ఆహారమునునిద్రియూ మోహంబు । అఖిలజీవులకారొక్కడే
దేహారూపమునడకలూ వేర్వేరు । తెలియగా ॥శి॥

58 ప్రాణిదేవునిభజించూజ్ఞానంబు । పుణ్యపాపము దెలియనూ
గాననరజన్మ సకలజీవులలో । ఘనమనిరి ॥శి॥

59 పగలురాత్రియును కాలభేదంబు । ఖగమృగాదులకులేదు
జగతిలోమానవులకూ । జెప్పబడె శాస్త్రవిధి ॥శి॥

60 సూర్యచంద్రనాడులాగు త్రెరిగి । భార్యతోగలియువలయూ
కార్యకాలము గురువుచే । తెలియ బహుకష్టమిది ॥శి॥

61 ఆరజోగుణమునందూ భోగింత । నరయురాజ సుడుగలుగు
క్రూరుండు జన్మించునూ । ఆతమో గుణమంగు ॥శి॥

62 సత్వగుణమునరమింప విద్వాంసి । శాంతుడు ధర్మిష్టియూ
సత్యవంతుడు తాపసీ । జ్ఞానియై జన్మించు ॥శి॥

63 వ్రతదినంబులుగూడపూగర్భమగు।మితముపదియారుదినముల్
ఋతుకాలమనిరి బుధులు భోగింప । రూఢిగా ॥శి॥

64 గాంచజీవోత్పత్తికీ । ఆగామి సంచిత ప్రారబ్ధముల్
అంచితంబగు కర్మచే । మూలమై యలరారు ॥శి॥

65 శుక్లంబుహెచ్చైనేని । పురుషుడగు , శోణితముచేస్త్రీయగు
శుక్లంబు శోణితంబు । జన్మలకు , సూత్రంబు ॥శి॥

66 ఆవిరెడుసనుమైననూషండుడగు । నరయుశుక్లముచెదిరెనా।
కవలుగా జన్మింతురు । తనకర్మ కారణము ॥శి॥

67 తలపన్ నా శుక్లంబున్నూ శోణితము। గలసి పక్షమున పెరుగై
మొలకయై రవేర్పడూ । నెలయైన ముఖ్యమగ ॥శి॥

68 నెలలు రెండైన చేతుల్ ।మరిగల్గు।నెలలు మూటనుఉదరము
నెలలు నాల్గైన కాళ్లు । యేర్పడును నిక్కముగ ॥శి॥

69 అరయనైదవమాసము। అవయవము।లమరునన్ని యువరుసగా
ఆరుమాసం బులైనా। నాళ్లమాట। తీరుగా ॥శి

70 అనువుగా యేడో నెలన్। జీవులకు। ఆకలియు దప్పిగలుగా
యెనిమిదవ మాస మందు। జ్ఞానంబు యేర్పడును ॥శి

71 ఈ గర్భనరకబాధా పడజాల। నీశ్వరా కరుణించరా
వేగమే బ్రోవు మనుచూ। ప్రార్థించు వేడ్కతో ॥శి

72 మలమూత్రముల కుక్షిలో బడి పొరలి। కలువరించుచునుంటిని
కలనైన యిక జన్మమూ వల దింక కడతేర్చు ॥శి

73 ఎన్ని జన్మము లెత్తితో।ఇక ముందు।ఎన్ని యున్నవో తెలియదు
అన్నిటిని సున్న జేసి। దరిజేర్చుమా స్వామి ॥శి

74 అంధకారములో బడి దరిలేక కుందుచుంటిని చిక్కచే
యిందుధర యింక నన్ను, బ్రోచుటకు సందియమ ॥శి

75 నీ మహిమ తెలియ వశమా। బ్రహ్మాది నిర్జరావళికైన
స్వామి నే నెంతవాడ రక్షించు సరగునను ॥శి

76 అంతటను యాపిండమూ విలపించి। హరుసధ్యానించగాను
యింతలో నవమాసముల్। పూర్తియగు। నెంచగా ॥శి

77 ద్దీనవదనుండగుచునూ। తిరిగితా। య్యోనిద్వారముబోరగనూ
మానితంబుగను పూర్వ। జ్ఞానంబు। మరచుతా ॥శి

78 ఈమాయ లోకమునకూ।పిండంబు మొదపది యువమాసముల్
భూమిపై బడినంతనే। భ్రమజెందు। పొలుపుగా ॥శి

79 పోత్తులను కొన్నినాళ్లు । బాల్యంబు । తత్తరత కొన్నినాళ్ళు
మత్తతను కొన్నినాళ్ళు । వర్తించు చిత్తభ్రమ ॥శి

80 సంసార మను మాయలో భార్య । తో సంతాన సంకెళ్ళతో
హంసోహ మెరుగలేక ।మూఢుడై హింసపడు ॥శి

81 వేదశాస్త్రపురాణముల్ । బఠియించి।వాదములు బహుచేసినా
ఆది తత్వము తెలియునా । గురు సూత్ర మందకను ॥శి

82 పంచముద్రలు యోగముల్ ।ఆసనము।లెంచముక్తికిమార్గముల్
గాంచ పెద్దలు జెప్పిరి । అభ్యాసక్రమములతో ॥శి

83 ముక్కుకన్నులు నోరును కర్ణములు । చక్కగా మూసిదృష్టి
నిక్కి భ్రూమధ్యమందు చూడ షణ్ముఖి యనిరి ॥శి

84 అందు దశవిధనాదముల్ । వినుపించు । పొందుగా వినువారికి
సందు లేకను చిత్కళల్ । గనుపించు నందముగ ॥శి

85 జలజాసనాసీనుడై । మనసులో కలువరింతలు లేకనూ
సలలితంబుగ దృష్టినీ । నిలుపుటే । శాంభవీ ॥శి

86 ధరనాసనాసీనుడై । నిర్మలత । సరిగ కన్నుల నడుమనూ
వరదృష్టి నిల్పినదియే । ఖేచరీ అరయగా ॥శి

87 రేచకము పూరకమునూ కుంభకము।వాసిగా సరిజూచుచూ
నాసికాగ్రమున దృష్టి । నిల్పుటే భూచరీ ॥శి

88 కనులు రెండునుమూసియూ 'భ్రూమధ్యకమలమునదృష్టినిల్పి
' దనరు నంత ఖేచరీ యనుముద్ర । తలపగా ॥శి

89 చూపురూపాకటిజేసీ। హృదయమునరూపింపగురుమంత్రమూ
ప్రాపైన లోచూపుచే । బ్రహ్మమును । దాపవలె ॥శి

90 స్థూలసూక్ష్మములు దాటీ గురుమంత్ర । సుషకారణాతీతుడై
వీలుగ సహస్రారమున్ జేర వలెకీ లెరిగి ॥శి

91 అదియె పరమానందమూ నిర్గుణంబదియె సమాధినిష్ట
అదియెజీవేశ్వరైక్య । సాయుజ్యమదెయుక్తి ॥శి॥

92 కనుదృష్టిపవనంబులూ చెదరినన్ । మనసువెంటనె చెదరును
మొనసియామూడుచెడిన । గురుదీక్ష మొదలెచెడు ॥శి॥

93 సర్వభూతదయాలుడై । వర్తించి । గర్వాపహారియగుచు
నిర్వికల్ప సమాధిలో । నినుజూచునేర్పయిది ॥శి॥

94 యోగమభ్యాసమైనా తనయందు రాగద్వేషములుపోవ
బాగుగానాత్మకపుడూ । సుఖమమరి । త్యాగియగు ॥శి॥

95 స్థూలసూక్ష్మకారణంబనుమూడుచూడదేహములుగలవు
వాలాయముగ వాటిని తెలియవలె వరుసగో ॥శి

96 శ్రీమనవస్త్రత్రియమునూ । విడిచినన్ । శాశ్వతానంద ముందు
అమనస్కమగు తెలియుడీ । సాధించు డాత్మసిధి ॥శి

97 విశ్వుడు తైజసుండూ । ప్రాజ్ఞుడని, వెలయు పేరులుమూడిటన్
శాశ్వతంబుగ జీవుడూ । వర్తించు నాజ్ఞచే శి

98 పుట్టగోచులను బెట్టి । యొడలెల్లదట్టముగ భూతిపెట్టీ
పొట్టకోసము వేషముల్ । వేసి భ్రమపెట్టుదురు ॥శి

99 దొంగగురువుల జేరినా। ఇహపరముభంగమగు తెలుసుకొనుమా
శృంగభంగము జెందకా। నిజగురుని చేరవలె ॥శి

100 సద్గురువు దొరికినపుడె। తనయందు దుర్గుణంబులు తొలగునూ
నిర్గుణుండై మోక్షమూ। జెందు తా నిక్కముగ ॥శి

101 మాయసంసారమనుచూ। తెలియకనుమత్తులై విహరించుచూ
కాయంబు స్థిరమటంచూ। యమపురిని గాంచుదురు ॥శి

102 సంసారిగా నుండియూ। సద్గురుని సరవితో పూజజేసీ
హంసమార్గము దెలిసినా బ్రహ్మమండైక్యమగు శి॥

103 పెద్దలను జూచినపుడే। దరిజేరి వద్దికను పూజజేసి
శుద్ధనిర్గుణ తత్వమూ తెలియవలె శుద్ధిగా శి॥

104 నూటవెయ్యిట వెదకినా నిజగురుడు। సూటిగాదొరుకుటరుదూ
బూటకపుజ్ఞానవిధులా విడువవలె వాటముగ శి॥

105 పుట్టుచావులు రెండునూ। లేనట్టి గుట్టుదెల్పెడి గురువునూ
పట్టువిడువక గొల్చినా తనజన్మ ఫలియించు శి॥

106 పుట్టి గిట్టుటమెకాని। తుదముట్టదెట్టి మానవుడైననూ
గట్టిగా నినుదెలియకా మోక్షొగ్గ్రు। డెట్లులగు ॥శి

107 తన్ను తా దెలియకున్న నిను గాంచ జెన్ని చదువులు చదివినా
తిన్నగా యాసూత్రము। గురువుచే తెలియవలె శి।

108 నీ వెరుగు రూపముననూ నిజతత్వభావమును దెలుపకునాఎ
యే విధిని తరియింతురూ । గురురూపదేవేశ శి॥

109 దొంగలార్గురుజేరియూ।మనసుబహుభంగపరచుచునుందురూ
సంగరహితుల జేరినా । నీ మహిమ సాధ్యమవు శి॥

110 ఆశయనుపాశములచే బద్ధులై । మోసపోవుచునుందురూ
యీామతాదులు విడువకా, నిను జేరరిది నిజము శి॥

111 వ్రతము లెన్నియు జేసినా । హోమాదిక్రతువు లెన్నొయొన
ర్చినా క్షితిని దృఢ భక్తి లేక ముక్తికిగతిలేదు శి॥

112 సంసారసాగరమున చిక్కుపడు।చావుపుట్టువు దొరకుయీా
హింసవదలెడి మార్గమూ గను పరమహంసయే శి॥

113 వీడవలె,కలిచేతలూ నిరతమును । పాడవలె శివగీతలూ
కూడవలె నిజభక్తులా । మోక్షంబు । వేడవలె ॥శి॥

114 చేరుడీ నిజయోగులా జ్ఞానమున । చీరుడీదుర్గుణములా
కోరుడీ పరమార్థమూ । ఇదిమోక్ష కారణము ॥శి॥

115 ఆసుషుమ్నా గ్రిమందు । చిత్కళల । నలరుపంచబ్రహ్మల
పైసూక్ష్మదృష్టినిల్పి । నాసిలిని భక్తితో ॥శి॥

116 దలపపృత్యాహారము । గ్రహియించి । ధ్యానధారణలమించి
అలరుతత్వ మసియంచూ । పతియించుడారూఢి ॥శి॥

117 తప్పులుండినదిద్దుడీ । మహనీయులొప్పుగాభావించుడీ
చెప్పలకగాదుగురుని । కృపచేతజెప్పితి ॥

118శ్రీవిరాడ్విశ్వకర్మ । బ్రాహ్మణుడ । శ్రీసువర్ణస గోత్రుడ
సావధానమున గనుడీ । వేదాంత । సారమిది ॥

119స్వామిశివశ్రీగౌరసా । అప్పలాచార్యుడను రచియించితీ
ప్రాముఖ్యమిది వెలయునూ । ఆచంద్ర భాస్కరము ॥

# మంగళ హారతి.



అంగనులందారురారే । మనగంగాధరునాకు మంగళారతు లివ్వ అం॥ శృంగారవదనునకు మంగాళకరునాకు బంగారుపళ్లెముగా మంగళారతినుంచి ॥అం॥ ఆశపాశములెల్లగోశి నీచ యీషణాదులు మదిలోకోసీ భాసూరమయినా పరమేశూని మీాలో నజూచి యానందనివాసులై నిరతాము ॥అం॥ త్రిపురసంహారుడువీడేనిజ తపసూలకెజిక్కె తాడె అపరిమితములైన యఘమూలుజిమ్ముాట, కుపమానమైబత్తి చపలాతవిడచీతె ॥అం

రూపునామములేనివాడే మనప్రాపు తానైయున్న వాడెయే
పుగమీరగ మనమేపేరదలచిన కాపాడిరక్షించె కరుణాసము
ద్రుడె ॥అం॥ మాటకీకియ్యగానివాడే । సత్యబాటలో చిక్కియుం
టాడె । కోటిసూర్యులకాంతి । మేటియైవెలిగె । త్రికూట ము
లోముక్తి బోటిసంటుంటాడె ॥అం॥ పుట్టుగిట్టుటలేని వాడే
మనపొట్టాల నిమిడియున్నాడే । పట్టివిగాముగురు గుట్టుదెలుసు
కొంటె బట్టబయలయి మనచుట్టూని యున్నాడె ॥అం॥ చెపవశ
క్యముగానివాడే గోరసప్పలచారిని బ్రోచువాడె । ఎప్పుడువెలి
గేటి వేదాతీతుని మీరు తప్పకజూచేటి తత్వము దెలిసియు ॥అం॥



ధనపతి ముద్రాక్షరశాల సత్తారామేశ్వరం.

